# బీ. హనుమంతరావుకు రావలసిన బాకీ!

## నల్లా ఖర్చు బాబతు రూ ౧౬౦౦

### ఉత్సవములో తహసీల్దారుగారి నిగ్రాని

యాదగిరిగుట్ట వార్తలు

(ప్రత్యేక విలేఖరి)

ఉత్సవము:—ఇచ్చటి ఉత్సవము ఎప్పటి వలె జరిగినది. తహస్సిలుదారుగారు నిగరాని చేయుటకై వచ్చి గుట్టక్రింద డేరావేసికొనిరి. వారి యిలాకా మనుష్యులు పైనయుండిరి. పండితులు మొదలగువారు వచ్చి సత్కరింపబడిరి.

ఆదాయవ్యయములు :— ఉత్సవములో మొత్తము కానుకలక్రింద రు ౧౬.౪ లు, గల్లాడబ్బాలో రు ౨౭౫ లు, ఇతరవిధముగు ఉత్సవ ఆదాయము ౧౬౦౦ లు అనియు తెలిసినది. ఈ విధముగా ఉత్సవదినములలో మొత్తమురాబడి రు ౨౧౬౪ లు అయినది. ఉత్సవము ఖర్చులు రు ౩౬.౦౦ లు అయినవట. పైకము తక్కువపడి నందున రు ౧౨౦౦ లు అప్పుతెచ్చి పనిజరిపినారట.

నిగరాని:—నిగరాని ఆరంభమైన సంగతి పత్రికాపాఠకులకు తెలిసియే యున్నదికదా! నిగరాని ఆరంభమైనప్పుడు దేవాలయ సంబంధమైన వస్తువులపట్టిక వ్రాసుకొన్నారు. ఏయేసామగ్రిపైన దేవత పేరుకలవో అవి దేవాలయమువిగాను, పేరులేని పాత్ర సామ్మ్రులు హనుమంతరావుగారి విగాను నిర్ణయముజరిగినది. గల్లాడబ్బాను సర్కారవారి తరఫుననే చూచుకొనబడు చుండెను. నిగరాని ౫ బహమన్ ౧౩౪౩ ఫ నాడు సమాప్తమైనది.

మల్లీహనుమంతరావుగారు:—ఆనాటినుంచిమల్లీనిగరాని హనుమంతరావుగారి దైనది. గల్లాడబ్బాకు తహసీలువారు సీలుచేసినారు. ప్రభుత్వాధికారి లెక్కలడిగినప్పుడు తక్కిన విషయములలో ఒకవిషయము నల్లా [నీటిగొట్టము] పెట్టించినబాబతు ఖర్చు ౧౬ వేలు అయినదనియు దానిలో ౧౨ వేల రూపాయలు తనకు దేవాలయమునుండి వసూలైనవనియు మిగత ౪ వేలు తనకు రావలసి యున్నవనియు చెప్పినారట, దేవాలయపు ఆమదని గతసంవత్సరము ౨౬ వేలు ఉండెననియు, ఖర్చు ౨౫ వేలు అయినదనియు చెప్పినారని వదంతి.

భోగము:—ఈసంవత్సరములో ౨౧ వైశనివారమునాడు పల్లాభోగము చేయించిరి. ఎందుచేతనో వంటచేయునపుడు ఇంటికి నిప్పంటుకున్నదట కొంతనష్టమైనది. గతసంవత్సర భోగము ౧౫ సేర్లే చేయించిరట ఈసారి ఎక్కువ భోదార్యము చూపబడినవి కాబోలును! ఈసారి ఉత్సవములో గల్లాడబ్బా లెక్కలు తీయుట ఏర్పాటు బాగుగా నుండలేదని కొందరు యాత్రికులు తలంచిరి! ఎందుచేతనో! భోజనము లడ్డూలతో దివ్యముగా జరిగినవి.

ఉపన్యాసములు:—వచ్చిన పండితులలో శ్రీయుతులు మడికొండలక్ష్మయ్యగారు, ఆదినారాయణశాస్త్రిగారు, శరగోపాలాచార్యులు (సికింద్రాబాదు) ముఖ్యులు వీరుఉపన్యసించుచు పందర్భశుద్ధిలేని ప్రసంగములు శ్రీవామననాయకుగారినిగూర్చి చేసిరట! అదియొక లెక్కలోనిమాట కాదు! సర్వాధికారులగు హనుమంతరావుగారి వలన లాభముపొందగోరు విద్వాంసుల విద్వత్తు వామననాయకుగారిని నిందించుటయందు ఉపయోగ పడకపోతే మరెందు కక్కరకువచ్చును! దీనివలన మెట్టిబాధయులేదు. ఈపండితులు నాయకుగారింటికి సంభావనకు వచ్చిననాటి ముచ్చటగదా! అనాడు ఎట్లుండునో "నాటికొక్కదైవములేడా!"

విచారకరము:—ఉత్సవదినములలో ఒకనాడు గుండ్లపల్లికాపురస్థుడగు పద్మినీ సాలీపిల్లవాడు ౧౬ ఏండ్లవాడు గుండములో జారిపడిచనిపోయినాడట. సాయంత్రమువేళ! రాత్రి ౮ గంటలకు పంచనామవగైరా జరిగినది.

మహాజరు [సంఘవిజ్ఞప్తి]:—ఒకమహాజరు చాలమంది యాత్రికుల దస్తకతులతో, వీరకాయలహనుమంతరావుగారి సుగుణగణములను స్తుతించుచు వీరినే ఎల్లకాలము ఉండవలసినదని తహస్సీలుదారిగారివద్దకు పంపబడినదట, వీరకాయలు వచ్చుచున్న దినములలో పత్వారి నిగరాని భారము జరుచున్న దినములలో హనుమంతరావుగారినే ఉంచవలసినదని యొక మహాజరుపోవడములో ఆశ్చర్యము ఎంతమాత్రములేదు!

తాలూకదారుగారు:—౧౦ బహిమన్ నాటివరకు అవ్వలు తాలూకదారుగారు ఇచ్చటికివచ్చెదరని ప్రతీతి ౮—౯ తారీఖులలో ఇచ్చటికివచ్చి, లెక్కల వివరములను పరిశీలించు, తారీఖున, హనుమంతరావుగారి మీాది షికాయతుల విచారణ జరిపెదమనియు తాలూకదారుగారు ఇదివరకే వ్రాసియుండిరి. ఆపనికొరకై వారువస్తారు కాబోలును. షికాయతు చేసినవారికి కూడా ఇదేమంచి సమయము. హైదరాబాదులో వారికి వీరికి చెప్పుకొనుటకంటె తాలూకదారుగారి యెదుట పడితేనేమంచిది! మహాజరు దాఖలుచేసిన అభిమానులుకూడా హాజరువుంటే సత్యము బయటపడగలదు.

నాజము సా॥ :—ఉమూరె మజహబి నాజము సా॥ గారివద్ద ఈ దేవాలయముయొక్క ఏర్పాటులు సర్కారువారి నిగ్రానీలో ఉంచుకొని మంచికమిటీయొకటి ఏర్పరచ వలసినదనియు, హనుమంతరావుగారి వారిషికాయతులు విచారించ వలసినదలన్ని కొందరు పెద్దలవలన దాఖలు అయినది. దాని వివరములు తెలిసికొని తగిన ప్రతీకారము చేయుటకొరకు హనుమంతరావుగారు హైదరాబాదువచ్చి పనిచేయుచున్నారనియు తెలిసినది:

పర్యవసానము.—తాలూకదారుగారియనుగ్రహమువలన వెనుకటి లెక్కలసంగతి ఎట్లావున్నా ఈసం॥ర ఉత్సవపు ఆదాయవ్యయములుసరిగా తేలినవి. ముందు స్థిరమైన ఏర్పాటులు కమిటీ ద్వారా జరుగునని అనుకొనుచున్నారు: హనుమంతరావుగారి భాగ్యము ఎట్లుండునో చూడవలసియున్నది.

---




## ౨౦౦౦౦ రూపాయీలు స్వాహా!

ఉస్మానియాయూనివర్సిటీ స్కూళ్ళకుగాను ఇంగ్లీషురీడర్లను సిద్ధము చేయుటకై స్పెయిట్ దొరవారికి పదివేలరూపాయీలిచ్చుటయు వారు తమ తెలివికొలది రీడర్లను సిద్ధముచేయుటయు అవి తృప్తికరముగా లేనందున మరల పది వేలరూపాయీలు యిచ్చి టర్నరుదొరవారిని వ్రాయగోరుటయు సంభవించినదని వినుచున్నాము. ఈవార్త నిజమేఅయిన మనవిద్యాశాఖవారిని కొనియాడ జాలము.

సుమారు ౯౦ లక్షలు విద్యపై ఖర్చుపెట్టుచుండినను విద్యాస్థితి మనరాష్ట్రములో చీమనడకతో వృద్ధియగుచున్నదంగతి వినుచునేయున్నాము ఇంతగొప్ప మొత్తముఖర్చు పెట్టియునేల యపేక్షణీయమైనఫలము లభింపలేదని అందరు నాశ్చర్య పడుచున్నారు. కారణమేమనగా ద్రవ్యము చాల భాగము యిట్టియనర్థ మార్గములలో వ్యయముచేయుటయే యుండవచ్చునని తోచుచున్నది.

బ్రిటిషుఇండియాలో మాయెరిగినంతవరకు కంపెనీవారు— మెక్మిలన్ లాంగ్మెన్ వంటివారగు—ప్రత్యేకగ్రంథకర్తలను వ్రాసినగ్రంథములను వరనీయ గ్రంథములుగా నంచుచున్నారు. గ్రంథకర్తకు కంపెనీవారికి గ్రంథము లెక్కువగానమ్ముడుబోవుటయే లాభము. యూనివర్సిటీవారికి యేమిన్ని ద్రవ్యనష్టముకానిదే వారికిలాభము. అనేకగ్రంథకర్తలు ప్రతివిషయమపేక్షింపక తాము వ్రాసిన గ్రంథములను టెక్సు బుక్కుకమిటీ సభ్యులవద్దికితీసికొనిపోయి వారినిప్రాధేయపడి తమగ్రంథమును పఠనీయగ్రంథముగా నేర్పాటుచేసికొనుచున్నారు. కాని మనరాష్ట్రములో పరిస్థితులు "ఉల్టా" ఉన్నవి. యూనివర్సిటీ వారేగ్రంథములను ప్రాధేయ పడుచున్నారు. మొన్న మొన్ననే ఆంధ్రయూనివర్సిటీవారు చారిత్రిక నవలను వ్రాయించుటకై నోటీసు యిచ్చి ఉత్తమ గ్రంథమునకు ౫౦౦ రూపాయీలు మాత్రమే బహుమతి యిత్తుమని ప్రకటించిరి. అప్పుడే డజన్లకొలదిగ్రంథకర్తలు గ్రంథములు వ్రాసిపంపినారు. అదేప్రకారము యితర పఠనీయగ్రంథములనుగూడ ఆంధ్రయూనివర్సిటీవారు అతిస్వల్పమొత్తములనిచ్చి వ్రాయించుచున్నారు.

మనరాష్ట్రములో యితర విధములగూడ ద్రవ్యము వ్యయము చేయబడుచున్నది. ఫలండర్ హైమెన్స్పత్రికకో వెలకొలదిరూపాయలనిచ్చి యా పత్రికయొక్క స్పెషల్ నంబరులనుకొని పిల్లలకుచితముగా పంచిపెట్టుచున్నారు.

యిట్టివిషయము లనేకములుకలవు. విద్యాశాఖవారికనైనను యిట్టియనవసర వ్యయముచేయక బ్రిటిషిండియా యూనివర్సిటీల ననుకరింతురని కోరుచున్నాము.

## గాంధిమహాత్ముని సంచారము

### ౧౯-౨ పైసల దానము!

గాంధిమహాత్మునికి జబల్పూరుసంచారములో తీరికలేకుండ పనిలేకుండెను. డిసెంబరు ౪ వ తేది వారుబహిరంగసభలలో ఉపన్యసించిరి. ౫వ తేది గొప్పనాయకులతో సంభాషించిరి. ౬ వ తేది మరడ్లనారాయణగంజ, బోరెలాలను దర్శించిరి. ౭ వ తేది హరిజన వభ్యలలోను స్త్రీలసభలలోను ఉపన్యసించిరి. ఆరోజే ఖద్దరుభాండారును స్వదేశీ మ్యూజియమును దర్శించి ౫ నిమిషములలో వేయిరూపాయల గుడ్డలను అమ్ముడుపోవునట్లుచేసిరి. లియోనార్డుథియలాజికల్ కాలేజిలో క్రైస్తవసభలో ఉపన్యసించిరి. హరిజనులను క్రైస్తవమతములోచేర్చుకొనకుండ వారిఉద్ధరణకై ప్రయత్నింపవలసినదని గాంధిగారు క్రైస్తవులను కోరిరి.

౭ వ తేది జబల్పూరువదలి గాంధీగారు సాహోపూరునకు వచ్చి ౮ వ తేది ఉదయము హోషంగాబాదు చేరిరి. అచటనొకహరిజనవసతిగృహములోఉండి అక్కడిఏర్పాట్లను హరిజనుల ఆర్థికస్థితులనుచూచి చాలానంతోషించిరి. ౯ వ తేదిమధ్యాహ్నము ఖండ్వాచేరి అచటఅఖిలభారతచరఖాసంఘశాఖను ప్రారంభించిరి. గాంధిచౌకులోవారికి మునిసిపల్ కమిటీవారును జిల్లాకౌన్సిలువారును వినతిపత్రములనర్పించుకొనిరి. రూ ౨౫౦౧ లున్న రూ ౧౦౦౦ లున్న ప్రత్యేకము సమర్పింపబడెను. గాంధిగారచ్చట ఉపన్యాసముగూడా చేసిరి. సాయంకాలము వారు బర్హాన్పూరుకుపోయి అచటనొకసభలోమునిసిపల్ కమిటీయొక్కయు హరిజనులయొక్కయు వినతిపత్రిములను రూ ౭౦౧ లను గ్రహించిరి.

ఇచ్చటనుండి బర్హాన్పూరునకువచ్చి ఆదా త్రిహోషంగాబాదుగుండా ఝాన్సీకవెళ్లిరి. భూపాలులో డిసెంబరు ౯ ఉదయము ఒకసభలో ఉపన్యసించిరి అక్కడ అంజుమన్ పర్షర్ దేన్ యొక్కయు, భోపాలుసంస్థాన ప్రజామహాసభయొక్కయు, విద్యార్థిసంఘముయొక్కయు, వినతిపత్రముల నందుకొనిరి మరియు వారికి ద్రవ్యముకూడ సమర్పింపబడెను

అంజుమన్ ఫర్జర్ దేన్ వారు ౧౯-౨ పాయీలు గల సంచిక నొకదానిని గాంధీగారికీయగా వారు ఇట్లు చెప్పిరి:

"ఇది ఎవరో తెలివిగల బాలురు చేసినపని. మీరు పైసల సంచిలో నూర్లకొలది రూపాయలను ప్రోగుచేసి యుండవచ్చును. మీరట్లు చేసెదరని నే నాశించుచున్నాను. మీరట్లు చేయనిచో నేను నవాబుసాహెబుగారితో చెప్పి మిమ్ములను బ్రిటిషు యిండియాలోకితరిమివేయించెదను. అక్కడమీకు మా అనుభవము ఒంటబట్టును. అప్పుడుగాని దోవకు రాజాలరు." దీనితర్వాత గాంధిగారు ఢిల్లీకపోయిరి ఢిల్లీలో విద్యార్థుల వలన ౧౦౦ రూపాయలను పొందిరి.

డిసెంబరు ౧౧౼౧౨ తేదులలోగాంధిగారు బహిరంగ కార్యములలో దేనిలోగాని పాల్గొనక హరిజనపత్రికకు వ్యాసములను వ్రాయుచుండిరి.

డిసెంబరు ౧౩ నాడు గాంధిగారు ఢిల్లీలో చాందిచౌకులో సనాతనులతో ౪ గంటసేపు మాట్లాడి ఢిల్లీకి ౯ మైళ్ల దూరములో నన్న అన్మన్పూరు అను పల్లెకుపోయి సనాతనులందరు అమ్ముకాయల కొరకు ఏర్పాటు చేసిన సభలో ఉపన్యసించిరి. అక్కడ గాంధిగారికిచ్చిన కానుకలు మొదలగువాటిని వేలము వేయగా రూ ౨౫౦ లు వచ్చెను.

డిసెంబరు ౧౪ వ తేది గాంధిగారు స్త్రీల సభలో నొకదానిలో ఉపన్యసించిరి. వారికిచ్చిన రెండు వినతిపత్రములను వేలము వేయగా యాభయి లును, రూ ౧౫౦ లును వచ్చెను. ఇంకా కొందరు సామానులు సొమ్ములు వేలమువేయగా రూ౧౫౦౦ మొదటిమొత్తములో కలిసి ౧౫౦౦ వచ్చెను. మరియొకచో హరిజనులు వినతిపత్ర మర్పించిరి. దానిని వేలమువేయగా రూ ౨౫౫ లును మరియొకరి వినతిపత్రమును వేలమువేయగా రూ ౧౦౦లును వసూలయ్యెను.

గాంధిమహాత్ముడు ౧౪ వ తేది సాయంకాలము ౭౪ గంటకు గ్రాండు ట్రంకు యెక్స్ప్రెసులో ఢిల్లీవదలిరి.

గాంధిమహాత్ముడు డిసెంబరు ౧౬ ఉదయము బెజవాడచేరిరి. అక్కడ స్టేషన్ ప్లాటుఫారము మీద జనము క్రిక్కిరిసి కనిపెట్టుకొనియుండిరి. వారివల్ల గాంధిగారు రూ ౨౦౦౦ లను పొందిరి. తర్వాత నాగేశ్వరరావు మొదలగువార్లతో కలసి చుట్టుప్రక్కల కొన్ని గ్రామాదులను సందర్శింపగా రూ ౮౦౦ కొన్ని నగలుకూడ లభించెను.

## కేసముద్రములో మహాత్ముడు

మహాత్మ గాంధిగారు ది 15-12-33 తేదిన బెజవాడకుబోవు సందర్భమున కేసముద్రమువద్ద రాత్రి 4 గంటలకు కొంతమంది పురజనులు హరిజననిధికి సహాయముచేసిన వివరములు.

కేసముద్రముం స్టేషన్మాస్టరు యం. భానుమూర్తిగారు విలువగల సీలము ఇచ్చిరి.

బంగారురాళ్ల వుంగరమును యిరుకుళ్ల వీరభద్రరావు (వరంగల్) గారు ఇచ్చిరి.

యింకా యితరులు వారివారి ఇష్టానుసారము (ద్రవ్యము నిచ్చిరి)

ఇట్లు
ఒకరు

## సవరణ

ఈసంచికలో ౪ వ పుటలో రెండవ శీర్షికయందు సంఖ్య "౧౨౦౦"అనిగాక రూ"౪౦౦" అని యుండవలెను.

## సంస్థాన వార్తలు

### సంస్థానములకు ఇండియా ప్రభుత్వమువారిచ్చిన అప్పులు

డిసెంబరు ౧౨ వ తేదినాడు ఢిల్లీ శాసనసభలో ప్రశ్నలడుగబడిన సమయమున కొందరు సభ్యులు ఇండియా ప్రభుత్వమువారు భారతదేశమందలి వివిధ సంస్థానములకు ఇచ్చిన అప్పులనుగూర్చి కొన్ని ప్రశ్నలు వేసిరి. వాటికి ఇండియా ప్రభుత్వములో అర్థశాఖామాత్యులగు సర్ జార్జి షుస్టరుగారు చెప్పిన సమాధానములవలన క్రింది విషయములు తెలియుచున్నవి —

సట్లెజ్ నదినుండి పంటకాల్వల నేర్పరచుటకై భావల్పూరు సంస్థానమునకు రూ ౧౧౫౭౦౦౦౦౦ లు అప్పియ్యబడెను. ఈసంఖ్య విషయమున అసోసియేటెడు ప్రెస్సు వార్తకును వారగలను. ఇప్పుడీయబడిన సంఖ్య అసోసియేటెడు ప్రెస్సుది. ఫ్రీప్రెస్సు రూ ౧౧౫౭౧౮౫౭౨ అని తెల్పుచున్నది. ఈభేద మెట్లున్న నేమి? షుస్టరుగారు భావల్పూరు సంస్థానమున కీయబడిన అప్పులో కొంత భాగమైనను మాఫీచేయవలసి యుండెడిదాయను ప్రశ్నకు అట్టి అవసరము వచ్చినట్లు తోచుటలేదనిరి. పంటకాల్వల సౌకర్యముల నేర్పరచిన ప్రాంతములో నిపుడు భూములు త్వరగా బాగగుచున్నవనియు మరికొంత బాగైనచో భావల్పూరు సంస్థానము ఇచ్చిన అప్పును తీర్చివేయగల్గుటయేగాక లాభమునుగూడ నిగుడ్చుకొనగలుననియు షుస్టరుగారు చెప్పిరి.

పాటియాలా సంస్థానమునకు ౭౦ లక్షల రూపాయల అప్పున్ను ఖైరిపూరు సంస్థానమునకు ౯ లక్షల అప్పున్ను ఇయ్యబడెను. ఇంతేగాక నవనగరు సంస్థానము రూ ౨౫౧౦౦౦౦ లున్ను త్రిపుర సంస్థానము రూ ౯౦౦౦౦౦ లున్ను అల్వారు సంస్థానము రూ ౨౫౦౦౦౦ లున్ను అప్పు కావలెనని కోరినవి. వాటిని ఇచ్చుటకు ఇండియా దొరతనమువారి మంజూరి అయినది. ధ్రాంగధ్ర సంస్థానమున్ను పాలా సంస్థానమున్ను క్రమముగా రూ ౪౫౦౦౦౦౦ లున్ను రూ ౧౫౦౦౦౦ లున్ను అప్పుకావలయునని కోరెను. ఈ మొత్తములను ఇవ్వవచ్చునా? కూడదా? అను విషయము విచారణలో నున్నది.

### రేవా సంస్థానము భూమి పన్నులో మాఫీ

మాఫీకై ప్రభుత్వము జాగీర్దార్లను హెచ్చరించుట

(ఫ్రీప్రెస్ ఆఫ్ ఇండియా)

జబల్పూరు డిసెంబరు ౧౧ —

లాల్ యాదవేంద్రసింగు రేవా సంస్థానమందు కాంగ్రెసు కమిటీకి నాయకుడు. ౧౯౩౭ ఏప్రిలునుండి ఆయనను జైలులో రాజఖైదీగా నుంచియుండెను. ఆయన తల్లికిని భార్యకును జబ్బుగా నుండుటవలన ఆయనను ఈరోజు వదలిపెట్టినారు. ఈయనగాక మరి ౧౨ మంది విచారణలేకయే జైలునందుంచబడియున్నారు. వారిని కూడ త్వరలో విడుదల చేయవచ్చును.

సంస్థానమందలి వ్యవసాయకులకు సహాయముచేయు ఉద్దేశ్యముతో రేవా దర్బారువారు మహారాజుగారి అనుమతిపొందిన ఒక షరతుపై మాల్గుజారీ రకములలో మాఫీ చేయుటకై ఆజ్ఞనిచ్చినారు. ౧౯౩౮ జనవరి ౩౧ లోగా భూమి పన్నులను చెల్లించు ఎవరికిగాని నూటికి ౨౦ మొదలుకొని ౩౦ రూపాయలవరకు మాఫీ నొసంగుటకు ఏర్పాట్లు గలవు. తమతమ యిస్టేట్లలో రైతులకు ఇట్టి రకముగ మాఫీల నొసంగవలసినదని సంస్థాన ప్రభుత్వమువారు సంస్థానములో చేరియుండు జాగీర్దార్లను కూడ కోరినారు.

రేవా సంస్థానములో సాహాగప్పూరు జాగీర్దారుని కూతురి అన్నప్రాశనము సందర్భమున ఆయన తన రైతులకు అందరికి మొత్తముమీద రూ ౨౦౦౦౦ లను మాఫీ యొసంగినారు.

### దేవాస్ మహారాజు ఆరోగ్యము మరల చెడుట

ఒకవారము నుండి పాండుచేరిలో యున్న దేవాస్ మహారాజుగారి ఆరోగ్యము మరల చెడినట్లును మహారాజుగారు పక్షవాతపునటుపు డిసెంబరు ౧౨ వ తేదినాడు మదరాసునుండి అసోసియేటెడు ప్రెస్సు వార్తయొకటి తెల్పుచున్నది.

### కాశ్మీర మహారాజు కలకత్తా బోవుట

కాశ్మీర మహారాజుగారు పోలోటీమును వెంటబెట్టుకొని డిసెంబరు ౧౫ వ నాడు కలకత్తాకు పోయిరట.

### తిరువేంద్రములో వైస్రాయి

తిరువాన్కూరు సంస్థాన శాసనసభకు శంకుస్థాపన జేయుట

వైస్రాయి లార్డు విలింగ్డనుగారు డిసెంబరు ౧౨ వ తేదినాడు తిరువేంద్రములో తిరువాన్కూరు సంస్థాన శాసనసభాభవనమునకు శంకుస్థాపన జేసిరి. ఆసందర్భమున వారు ఉపన్యసించిరి. తమప్రజలను సంస్థాన పరిపాలనా విషయములలో పూర్వముకంటె ఎక్కువ పాల్గొనునట్లు చేయుటకై మహారాజుగారు ఏర్పరచిన ప్రణాళికను ఏగొప్ప ఆశయములు పురిగొల్పియుండెనో ఆ ఆశయములను సాధించుటకు ఇచట కట్టబడు భవనము తోడ్పడుగాక యని వైస్రాయిగారు ఉపన్యాసములో ఆశించిరి. భారతదేశమున కంతటికిని క్రొత్త సంస్కరణము రానున్న సమయమున ఈవిధముగ తిరువాన్కూరు సంస్థానమునకు నూతన సంస్కరణలువచ్చుట గమనింపదగిన విషయమని వైస్రాయిగారు చెప్పిరి. చాలకాలము నుండి తిరువాన్కూరు సంస్థానములో అభివృద్ధికరములగు సంప్రదాయములు ప్రసిద్ధములై యున్నందుకు సంస్థానమును ప్రశంసించిరి. ఆధునిక శాసనసభలో భవిష్యత్తు శాసన నిర్మాణమున పాల్గొనువారందరు తమ బాధ్యతకు అనుగుణముగా సాంఘిక విభేదములకు అవకాశమీయకుండ ప్రవర్తింపగలరని విలింగ్డనుగారు ఆశించిరి.

### వైస్రాయీగారు పుదుక్కోట సంస్థానము దర్శించుట

వైస్రాయిగారును విలింగ్డను లేడిగారును వారి అనుచరులును డిసెంబరు ౧౩ నాడు ఉదయము పుదుక్కోట చేరిరి. వైస్రాయిగారు సతీసమేతులై బండిదిగగానే పుదుక్కోట రాజాగారును గవర్నరు జనరలుగారి ఏజంటుఅగు లెఫ్టినెంటు కర్నల్ డి యం ఫీల్డుగారును అడ్మినిస్ట్రేటరు (పరిపాలకుడు) అగు బి జి హాల్డు సువర్టుగారును స్వాగతమిచ్చిరి. అంతట గవర్నరు జనరలుగారి ఏజంటు వైస్రాయిగారికిని సతికిని సంస్థానాధికారులను పరిచయము చేసిరి.

ఇట్లు పరిచయోత్సవము ముగిసినపిమ్మట రాజప్రతినిధి దంపతులు మనోహరముగా అలంకరింపబడియుండినట్టి వీధులలో గుండాబయట వేచియుండిన కొర్లలో పోలీసు వారు మైదానములో వేయబడియున్న మంటపమునకు గొనిపోబడిరి. అక్కడ పురపాలకసంఘమువారు స్వాగతమిచ్చిరి.

వైస్రాయిగారు సంస్థానమునకు వచ్చిపోయినందునకుగాను స్మారకార్థమై గవర్నరుగారి రోడ్డు నానుకొని పట్టణమునకు బోవురోడ్డునకు విలింగ్డనురోడ్డు అనుపేరు పెట్టబడినవి.

ఇట్లు వైస్రాయిగారి దక్షిణ భారత సంస్థానములలో సంచారము ముగిసినందున వారు డిసెంబరు ౧౮ వ తేది ఉదయము మదరాసుపోయిరి. మద్రాసు గవర్నరుగారు ఇతర ప్రభుత్వోద్యోగులును అచట వైస్రాయిగారికి స్వాగతమిచ్చి గౌరవించిరి. పట్టణములో అనేకులు అనేక సన్మాన పత్రములు సమర్పించిరి.

